ఆది వ్యాధులకులోనై శ్రీరామచంద్ర
మితిమీరిన బాధలపాలైతి శ్రీరామచంద్ర. ౫

శ్రీధర మాధవ యనుచు రామచంద్ర
మదిలో చింతింప సతతంబు శ్రీరామచంద్ర. ౬

సంసారాంబుధిలోన మునిగి రామచంద్ర
సకల హింసలకు పాలైతి శ్రీరామచంద్ర. ౭

హంసరూప వేగమె శ్రీరామచంద్ర
నన్నాదగింపు ప్రేమతో శ్రీరామచంద్ర. ౮

ఆశా అహంకారములు జేరి రామచంద్ర
నన్ను ఆడించుచు వైరమున శ్రీరామచంద్ర. ౯

గాసిపెట్టుచున్న పిష్టు రామచంద్ర
గాన గనజాల నిను కన్నులార రామచంద్ర. ౧౦

ఎందుజూచిన బ్రహ్మమై శ్రీరామచంద్ర
నిండి యుండువని శ్రుతులుబల్కు రామచంద్ర ౧౧
మందబుద్ధియైన నేను రామచంద్ర
బ్రహ్మనంద మెటులగందునయ్య రామచంద్ర ౧౨
నిర్మలాంతఃకరణులు శ్రీరామచంద్ర
మదిని నిన్నెప్డు గనుచుందురు శ్రీరామచంద్ర ౧౩
కర్మబంధముల్గల నరులు రామచంద్ర
నిన్నుగాంతురెట్లు తెలియగ శ్రీరామచంద్ర ౧౪
వాదతర్కమ్ములు మాని శ్రీరామచంద్ర
సద్గురు బోధమదిని నిల్పుకున్న రామచంద్ర. ౧౫
నీ దివ్యదర్శనము వారికి రామచంద్ర.
గల్గునెట్లు నిలుకడ యిహపరము శ్రీరామచంద్ర ౧౬

సూర్యాంధకారమునడచి శ్రీరామచంద్ర.
జ్ఞానమార్గంబు గనలేక శ్రీరామచంద్ర. ౧౭

కాయము స్థిరమనుచు నమ్మి రామచంద్ర.
వెనుకటిగతి ఏదో గనవైతి శ్రీరామచంద్ర. ౧౮

సుఖ దుఃఖముల రెంటిని శ్రీరామచంద్ర.
సరిగ జూడకను మోహినైతి రామచంద్ర. ౧౯

ఎఱిగినవారలమనుచు రామచంద్ర.
కొందఱు విఱ్ఱవీగుచును మరి శ్రీరామచంద్ర. ౨౦

కొంపమాలిన యొఱుకలెఱిగి రామచంద్ర
నిన్నుగొల్వరు సతతంబు శ్రీరామచంద్ర. ౨౧

సాధువులచే నరులు భువిని రామచంద్ర సద్గురు
బోధవినియు మోనమున శ్రీరామచంద్ర. ౨౨

ఆదికారణమైన నిన్ను రామచంద్ర
తత్వంబరయుదురు పరమభక్తి రామచంద్ర. ౨౩
సాధుజన సాంగత్యమున శ్రీరామచంద్ర
వైరాగ్య బోధోపరతిగల్గియు శ్రీరామచంద్ర. ౨౪
వేదాంత సారంబునెఱిగి రామచంద్ర
బుధులు వెలుగొందుచుందురు జగతి రామచం॥ ౨౫
పరతత్వ మీవనుచు నరులు రామచంద్ర
మదినిభావించిరేని ధన్యులైరి రామచంద్ర. ౨౬
శ్రీరామ జయరామయనుచు రామచంద్ర
నిన్ను సేవించు సజ్జనులు శ్రీరామచంద్ర ౨౭
ఘోరసంసారాంబుధిలో శ్రీరామచంద్ర
దాటు వారలరు గోవింద శ్రీరామచంద్ర. ౨౮

నీ నామ జపముచే శ్రీరామచంద్ర
వాల్మీకి నిర్మలాంతఃకరణుడై రామచంద్ర. ౨౯

కామాదిరిపువర్గము దునిమి రామచంద్ర
జేరె నిన్ను కౌస్తుభమణి భరణా శ్రీరామచంద్ర. ౩౦

పరమగోప్యము ముక్తి ప్రదమౌ రామచంద్ర
నీనామ భజనచేయుచు పరమశివుడు రామచంద్ర. ౩౧

గిరిజ కుపదేశించె ప్రీతి రామచంద్ర
ఆనందభరితుడై మురియుచు శ్రీరామచంద్ర. ౩౨

భక్తిజ్ఞానయోగంబుచే రామచంద్ర
మునులు పరంధామ మదినిన్నుదలచి రామచంద్ర. ౩౩

భుక్తి ముక్తి బొందియు శ్రీరామచంద్ర
వారు పూర్ణులై విలసిల్లిరి శ్రీరామచంద్ర ౩౪

పరమ పావనమై ప్వా శ్రీరామచంద్ర
నీనామ భజనచే సనకాది గులు రామచంద్ర ౩౫
నిరవధిక సౌఖ్యముల గనిరి రామచంద్ర
ధీరులై నిత్యనిర్మల నిర్వికల్ప రామచంద్ర. ౩౬
జ్ఞానానంద మని నిన్ను రామచంద్ర
పెన్నిధానమని సాధుజనులు రామచంద్ర. ౩౭
ధ్యానించి సేవించుచుందురు రామచంద్ర
వారు సుజ్ఞానులై హరి కృష్ణాయనుచు రామచంద్ర. ౩౮
పరమ భాగవతులౌ నరులు రామచంద్ర
తమ భావంబుల నిల్పి నిన్ను రామచంద్ర. ౩౯
పరవశులునై మోదమలర రామచంద్ర
అన్న మెరుగరయ్య పరంధామ శ్రీరామచంద్ర. ౪౦

కోపతాపంబులు విడిచి శ్రీరామచంద్ర
భక్తులు నీపాదపద్మములు నమ్మి రామచంద్ర. ౪౧

ప్రాపుదాపని గొల్తురెపుడు రామచంద్ర
తమతమ భావంబుల మమతవీడి రామచంద్ర. ౪౨

భావింప నీపదకమలముల రామచంద్ర
అరయ భాగీరథి బుట్టియు శ్రీరామచంద్ర. ౪౩

భూవలయమునందు జనుల రామచంద్ర
పాపసం[illegible]యదె పవాసుదేవ రామచంద్ర. ౪౪

ధీరులు నిరసేత్తులు శ్రీరామచంద్ర
సంసారదూరులై తమ తనువుల్ మరచి రామచంద్ర. ౪౫

శ్రీరామ రామ రామయనుచు రామచంద్ర
భజనల్ జేయుచుంద్రు సతతంబు శ్రీరామచంద్ర. ౪౬

బుధవరేణ్యులైన వారికి రామచంద్ర
తెలియ పుణ్యపాపము లంటవెపుడు రామచంద్ర. ౪౭

చక్కెరయు లవణంబు శ్రీరామచంద్ర
జలమందున చక్కగ గలసినరీతి రామచంద్ర. ౪౮

మిక్కిలి తనుగను ఘనుని మది శ్రీరామచంద్ర
ఆనంద జలధిలోక్క నశియించును శ్రీరామచంద్ర. ౪౯

అరయగ యిను డస్తమింప రామచంద్ర
కరణంబు లతనితో జనురీతి శ్రీరామచంద్ర. ౫౦

పెనువికారంబులెల్ల రామచంద్ర
మనముతో జనుచుండు వేగమె శ్రీరామచంద్ర. ౫౧

హరినామ కీర్తనలు జేయుచు రామచంద్ర
ఆర్యులు ఆత్మారాములునై రామచంద్ర. ౫౨

దిరుగుచుందు రవనిలో శ్రీరామచంద్ర
అతి హర్షంబు మీరగ శ్రీరామచంద్ర. ౫౩
అట్టి బ్రహ్మానంద పదవి నాకు రామచంద్ర
యిచ్చి అనుగ్రహింపుము సర్వేశ శ్రీరామచంద్ర. ౫౪
శిష్టరక్షణ దుష్టశిక్షణ రామచంద్ర
దేవ సృష్టీశ భువనపాల శ్రీరామచంద్ర. ౫౫
ధర్మస్థాపన జేయగ శ్రీరామచంద్ర
దనుజుల దండించి మర్దింప శ్రీరామచంద్ర. ౫౬
బ్రహ్మాది సురమునులు వేడ రామచంద్ర
నియ్యకొనియు ప్రమదంబుమీరగ శ్రీరామచంద్ర. ౫౭
ఇనవంశమునందు బుట్టి రామచంద్ర
జనకజను చేపట్టి శ్రీరామచంద్ర. ౫౮

అనుజులతో గూడి వేడ్క రామచంద్ర
పురిజేరి హర్షమొప్పయుండి శ్రీరామచంద్ర. ౫౯
తండ్రి యాజ్ఞనబూని శ్రీరామచంద్ర
సతితో తమ్ముడు తనుగొల్వ శ్రీరామచంద్ర. ౬౦
ధరణిసుత గొనిపోవ దనుజుడు రామచంద్ర
యా తరుణిమణిని వెదకుచుజని రామచంద్ర ౬౧
కరుణించి శబరిని వేగ రామచంద్ర
సుగ్రీవు నరసి సఖ్యంబుజేసి రామచంద్ర ౬౨
హరిసుతుని బరిమార్చి శ్రీరామచంద్ర
వేగ హరితనయుని నాదరించి రామచంద్ర. ౬౩
హరివరులను బంపగ శ్రీరామచంద్ర
సతిని అరసియు హనుమంతుడు రహను రామచంద్ర. ౬౪

సీతాదేవి క్షేమముదెల్ప రామచంద్ర
కపులుచే సేతువుగట్టించి శ్రీరామచంద్ర. ౬౫

ఆ తరి విభీషణునకు రామచంద్ర
నీవు అభయంబొసగ అమరుల్ బొగడ రామచంద్ర. ౬౬

అతివేగమున లంకజొచ్చి రామచంద్ర
దశకంఠుని సుతహిత బాంధవులతో శ్రీరామచంద్ర. ౬౭

హతముగావించి మించి రామచంద్ర
ముదమున అమరేంద్రునిచే వరముల్ గొని శ్రీరామచంద్ర

పరమహర్షము మీరగ శ్రీరామచంద్ర
కపివీరులతో ధరణితనయన్ గూడి వేడ్క రామచంద్ర ౬౯

వరవిమానమెక్కియు శ్రీరామచంద్ర
సాకేతపురముజేరి సంతోషమున రామచంద్ర. ౭౦

సీతాదేవితోడ వేడ్క రామచంద్ర
పట్టాభిషిక్తుడవై ముదమున శ్రీరామచంద్ర. ౨౧

ఖ్యాతిమీర జగములనెల్ల రామచంద్ర
పాలించితివి కమలాప్తకులశేఖర శ్రీరామచంద్ర. ౨౨

భూతభావన భూతేశ శ్రీరామచంద్ర
సీతాదేవి సహిత శ్రీరామచంద్ర. ౨౩

రాజరాజపూజిత పదనత రామచంద్ర
రాజీవదళలోచన శ్రీరామచంద్ర. ౨౪

మాధవ మత్స్యావతార రామచంద్ర
శ్రీధర కూర్మావతార రామచంద్ర. ౨౫

పరమపురుష వరహారూపా రామచంద్ర
హరి నిరుపమ కల్యాణగుణ శ్రీరామచంద్ర. ౨౬

ఆదిదేవ నారసింహా రామచంద్ర
హరి అచ్యుత వామనరూప రామచంద్ర. ౭
భార్గవ రామావతార రామచంద్ర
దేవ నిర్గుణ నిరుపమ తేజ రామచంద్ర. ౮
దశరథ వరతనయ శ్రీరామచంద్ర
దశకంఠమర్దన శ్రీరామచంద్ర. ౯
బలరామ నిజభక్తపాల రామచంద్ర
నను పాహి గోకుల నిలయ రామచంద్ర. ౧౦
బుద్ధకల్కిరూప శ్రీరామచంద్ర
హరి సిద్ధజనసేవిత శ్రీరామచంద్ర. ౧౧
నారదాదిమునిగేయ శ్రీరామచంద్ర
శౌరి [illegible] మంగళాకార రామచంద్ర. ౧౨

పారిజాసనాదివినుత రామచంద్ర
భక్త పారిజాత పరంజ్యోతి శ్రీరామచంద్ర. ౧౩
కేశవ భవక్లేశనాశ రామచంద్ర శ్రీశ
భానురాంగ పరమోదార రామచంద్ర. ౧౪

నారాయణ గరుడగమన రామచంద్ర
వీరా శూరా శృంగార శ్రీరామచంద్ర ౧౫
మాధవ మాయావిదూర రామచంద్ర
మౌని గాధితనయ మఖసంరక్షణ రామచంద్ర. ౧౬

గోవింద గోపాలబాల రామచంద్ర
శౌరి భూవర మానుషవేష రామచంద్ర. ౧౭
విష్ణు జిష్ణు విశ్వంభర శ్రీరామచంద్ర హరి
వేద వేదాంతవేద్య రామచంద్ర. ౧౮

మధుసూదన సదయ హృదయ రామచంద్ర
సాధు బుధజనసేవిత శ్రీరామచంద్ర. ౮౯
త్రివిక్రమ త్రిగుణాతీత రామచంద్ర
దేవ దినమణి వంశాబ్ధి సోమ రామచంద్ర ౯౦
వామనసురరాజవంశ్య రామచంద్ర
స్వామి కౌసల్యవరతనయ శ్రీరామచంద్ర. ౯౧
శ్రీధర చిన్మయరూప రామచంద్ర
శౌరి యాదవకులభూషణ శ్రీరామచంద్ర. ౯౨
హృషీకేశ యోగిధ్యేయ రామచంద్ర
సర్వ విషయాది ఖండన శ్రీరామచంద్ర. ౯౩
పద్మనాభ దీనబంధో రామచంద్ర.
అఖిలపాప సంహార శ్రీరామచంద్ర ౯౪

దామోదర ధరణీపాల రామచంద్ర
కామక్రోధ హరణ శ్రీరామచంద్ర. ౯౫

సంకర్షణా సకలాధార రామచంద్ర
విబుధ శంకరాది వినుత శ్రీరామచంద్ర. ౯౬

వాసుదేవ హరి పరమేశ రామచంద్ర
నిజదాసావన రాఘవ శ్రీరామచంద్ర. ౯౭

ప్రద్యుమ్న భవపాశనాశ రామచంద్ర
దేవ పారావార గంభీర శ్రీరామచంద్ర. ౯౮

అనిరుద్ధ ఆనందనిలయ రామచంద్ర
రాజ మనసిజకోటి లావణ్య రామచంద్ర. ౯౯

పురుషోత్తమ కరిరాడ్వరద రామచంద్ర
హరి కరుణామయ శ్రీకమలాప్రియ శ్రీరామచంద్ర. ౧౦౦

అధోక్షజ అఘువినాశ రామచంద్ర
శౌరి ఆర్యజన పూజిత పదనత రామచంద్ర. ౧౦౧

నారసింహ అసురసంహార రామచంద్ర
నరసురవందిత చరణ రామచంద్ర. ౧౦౨

అచ్యుత ఆద్యంతరహిత రామచంద్ర
హరి నిత్యనిర్మల నిరంజన రామచంద్ర. ౧౦౩

జనార్దన సజ్జనపాల రామచంద్ర
శౌరి సత్య జ్ఞానానంద శ్రీరామచంద్ర. ౧౦౪

ఉపేంద్ర శ్రీకాంతలోల రామచంద్ర
దేవ యోగారూఢ యోగానంద రామచంద్ర. ౧౦౫

హరి శ్రీవైకుంఠవాస రామచంద్ర
అవ్యయ అజమకుర శ్రీరామచంద్ర. ౧౦౬

ఔ కృష్ణ ద్వారకనిలయ రామచంద్ర
శ్రీ రుక్మిణి రాధారమణ రామచంద్ర. ౧౦౭
నమోనమో సుఖదాయక రామచంద్ర
ఈశ నమోనమో భవహరణ శ్రీరామచంద్ర. ౧౦౮
రామపుత్రి హృదయవాస రామచంద్ర
సకల కామిత ఫలకల్పద్రుమ శ్రీరామచంద్ర ౧౦౯
మంగళము మహనీయ తేజ రామచంద్ర
జయమంగళము శ్రీరమేశ రామచంద్ర. ౧౧౦

శ్రీ సీతారామ చంద్రార్పణమస్తు.

ఇది శ్రీరామచంద్ర స్తోత్రం.

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీ ర స్తు.

# రామకృష్ణస్తోత్రం

1. శ్రీ రఘుకులపతి రామహరీ శ్రీయదుకులపతి కృష్ణహరీ
2. దశరథనందన రామహరీ వసుదేవకుమార కృష్ణహరీ
3. ధరణీనాయక రామహరీ ధరసురవందిత కృష్ణహరీ
4. దినకరవంశజ రామహరీ దేవకీనందన కృష్ణహరీ
5. సీతాసహిత రామహరీ శ్రీ రుక్మిణిప్రియ కృష్ణహరీ
6. తాటకమర్దన రామహరీ పూతనసంహార కృష్ణహరీ
7. అహల్యశాపహర రామహరీ అక్రూరప్రియ కృష్ణహరీ
8. అసురసంహార రామహరీ అఘాసురమర్దన కృష్ణహరీ
9. మునిజనసన్నుత రామహరీ మోహవిదూర కృష్ణహరీ
10. పావననామ రామహరీ పతితపావన కృష్ణహరీ

11. దేవదేవ శ్రీరామహరీ దీనావన శ్రీ కృష్ణహరీ
12. భువనాధార రామహరీ భుక్తిముక్తి ప్రద కృష్ణహరీ
13. భూతాత్మక శ్రీరామహరీ భూతాశ్రయ శ్రీకృష్ణహరీ
14. భూతేశ్వరనుత రామహరీ భూతభావన కృష్ణహరీ
15. యజ్ఞఫలప్రద రామహరీ యజ్ఞఫలాశన కృష్ణహరీ
16. యజ్ఞసంరక్షణ రామహరీ యజ్ఞపత్నినుత కృష్ణహరీ
17. సుజ్ఞానప్రద రామహరీ సుఖదాయక శ్రీ కృష్ణహరీ
18. ధర్మాధార రామహరీ ధర్మాకార కృష్ణహరీ
19. నిర్మల నిర్గుణ రామహరీ నిర్వికార శ్రీ కృష్ణహరీ
20. యోగముద్రాన్విత రామహరీ యోగసిద్ధిప్రద కృష్ణహరీ
21. యోగప్రియ శ్రీరామహరీ యోగీశ్వరేశ శ్రీ కృష్ణహరీ
22. ధ్యానధ్యేయా రామహరీ ధ్యానానంద కృష్ణహరీ
23. జ్ఞానగమ్య శ్రీ రామహరీ గణనాతీత కృష్ణహరీ

24. తత్త్వాతీత రామహరీ తత్త్వనిరూపణ కృష్ణహరీ
25. సర్వవ్యాపీ రామహరీ సర్వాతీత కృష్ణహరీ
26. సంగరహిత శ్రీ రామహరీ సంగీతప్రియ కృష్ణహరీ
27. మంగళాంగ శ్రీ రామహరీ శృంగార శరీర కృష్ణహరీ
28. పూజా విషయా రామహరీ పూజాఫలప్రద కృష్ణహరీ
29. లక్ష్మీకర శ్రీ రామహరీ లక్ష్మీధర శ్రీ కృష్ణహరీ
30. లక్ష్మీప్రద శ్రీ రామహరీ లక్ష్మీశా శ్రీ కృష్ణహరీ
31. రామపుత్రినుత రామహరీ సామజవరద కృష్ణహరీ
32. జయజయ శ్రీగురు రామహరీ జయజయ సద్గురు కృష్ణహరీ

శ్రీ రామార్పణము

ఇది శ్రీ రామపుత్రి విరచిత
రామకృష్ణ హరినామావళి
సంపూర్ణము.

# మంగళహారతి.

అచ్యుతానంతాయ అవ్యయాఖండాయ
నిత్య నిరంజన నిర్మలాయ
సచ్చిదానందాయ శాంతాయ దాంతాయ
పవిత్ర్యగాత్మ స్వరూప పావనాయ ॥జయ ౧

ఆనంద నిలయాయ అహంకార రహితాయ
అహం బ్రహ్మాస్మి (శ్రీ) హరిహరాయ
మానసోల్లాసాయ మంగళాకారాయ
జ్ఞాన స్వరూపాయ మాధవాయ ॥జయ ౨

తత్వ స్వరూపాయ తత్వాధారాయ
తత్వ నిరూపణ ధార్మికాయ
తత్వమసీవాక్య తత్వభోదాయ (శ్రీ)
తత్వాతీతాయ నిర్గుణాయ ॥జయ ౩

అయమాత్మ బ్రహ్మమను అమల స్వరూపాయ
అంజనాసుత మనోరంజనాయ
భయదుఃఖ హారణాయ పరమ పవిత్రాయ
జయ రమారమణాయ శాశ్వతాయ ॥జయ ౮
శ్రీ రామపుత్రి మనోచింతిత పదాబ్జాయ
నారదాదిమాని సేవితాయ
శ్రీ రమణీమణి చిత్తాబ్జ నిలయాయ
కారుణ్యమూర్తి జగత్కారణాయ ॥జయ ౯

జయమంగళము సదా శుభమంగళము.

శ్రీరామ చంద్రార్పణమస్తు.

శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ సాధన ప్రెస్, అనంతపురం.